ఓం శ్రీ సాయి రామ్

# గజేంద్ర మోక్షం

(కొన్ని పద్యములు)

సీ. భుగభుగాయుత భూరి బుద్బుదచ్ఛటలతోఁ గదలుచు దివికి భంగంబు లెగయ
భువన భయంకర ఫూత్కార రవమున ఘోరనక్ర గ్రాహకోటి బెగడ
వాలవిక్షేప దుర్వార ఝూంఝూనిల వశమున ఘుమఘుమావర్తమడరఁ
గల్లోల జాల సంఘుత్తనంబులఁ దటీ చరులు మూలములతో ధరణిఁగూల

తే. సరసి లోనుండి పొడగని సంభ్రమించి యదరి కుప్పించి లంఘించి హుంకరించి
భానుఁ గబళించి పట్టు స్వర్భాను పగిది నొక్కమకరేంద్రుఁ డిభరాజు నొడిసిపట్టె.

క. కరిఁ దిగుచు మకరి సరసికిఁ, కరి ధరణికి మకరిఁ దిగుచుఁ కరికరిబెరయన్
కరికి మకరి మకరికిఁ గరి, భరమన నిట్లతల కుతల భటులదరిపడన్.

శా. పాద ద్వంద్వము నేలమోపి పవనున్ బంధించి పంచేద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్, మాఙాకు హత్తించి నిః
ఖే(భే)ద బ్రహ్మపదావలంబన గతిం గ్రీడించు యొగీంద్రు మ
ర్యాద న్నక్రము విక్రమించెఁ గరి పాదాక్రాంత నిర్వక్రమై

ఉ. ఊహ కలంగి జీవనపు టోలమునం బడి పోరిచున్ మహా
మోహలతా నిబద్ధ పదమున్ విడిపించు కొనంగలేక సం
దేహముఁ బొందు దేహక్రియ దీనదశన్ గజముండె భీషణ
గ్రాహ దురంత దంత పరిఘట్టిత పాదఖురాగ్ర శల్యమై.

శా. నానానేక పయూధముల్ వనములోనం బెద్దకాలంబు స
న్మానింపన్ దశలక్షకోటి కరణీ నాథుండనైయుండి మ
ద్దానాంభః పరిపూర్ణ చందన లతాంత చ్ఛాయలందుండలే
కీ నీరాశ నిటేల్ వచ్చితి, భయంబెట్లోకదే, యీశ్వరా!

శా. ఏ రూపంబున దేనిగెల్తు, నిటమీఁ దేవేల్పుఁజింతింతు, నె
వ్వారిం జీరదు, నెవ్వరడ్డమిక, నివ్వారి ప్రచారోత్తమున్
వారింపం దగు వారలెవ్వ, రఖిల వ్యాపార పారాయణుల్
లేరే, మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్.

ఉ. ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై
యెవ్వరని యందు డిందు బరమేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వఁడనాది మధ్యలయుడెవ్వడు సర్వముఁ దానయైన వాఁ
డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్.

క. ఒకపరి జగములు వెలినిడి, యొకపరి లోపలికిఁ గొనుచు నుభయము దానై
సకలార్థ సాక్షియగు నయ్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్.

క. లోకంబులు లోకేశులు, లోకస్థులుఁ దెగిన తుది నలోకం బగు పెం
జీకటి కవ్వల నెవ్వడు, నేకాకృతి వెలుగు నతని నే సేవింతున్.

సీ. భవము దోషంబు రూపంబు కర్మంబు నాహ్వాయమును గుణము లెవ్వనికి లేక
జగములఁ గలిగించు సమయించు కొఱకునై నిజమాయ నెవ్వఁడిన్నియును దాల్చు
నాపరేశునకు ననంత శక్తికి బ్రహ్మైకిద్ధరూపికి రూపహీను నకును
జిత్ర చారునకు సాక్షికి ఆత్మవిభునకుఁ బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు

ఆ. మాటల నెఱుకల మనములఁ జేరంగఁగాని శుచికి సత్త్వ గమ్యుడగుచు
నిపుణుడైనవాని నిష్కర్మతకు మెచ్చువాని కేనొనర్తు వందనములు.

తే. స్త్రీ నపుంసక పురుష మూర్తియును గాక తిర్యగమర నరాది మూర్తియును గాక
కర్మ గుణ భేద సదసత్ప్రకాశిగాక వెనుక నన్నియుఁ దానగు విభఁదలంతు.

క. కలఁడందురు దీనులయెడఁ గలఁడందురు పరమయోగి గణములపాలం,
గలఁడందు రన్నిదిశలను, గలఁడు గలండనెడువాడు గలడో లేడో.

సీ. కలుగడే నాపాలి కలిమి సందేహించి గలిమి లేములు లేక గలుగువాడు
నాకడ్డ పడరాడె నలిన సాధువులచేఁ బడిన సాధుల కడ్డపడెడువాడు
చూడడే నాపాటు చూపులఁజూడక చూచువారలఁ గృపఁజూచువాడు
లీలతో నా మొరాలింపడే మొఱఁగుల మొఱఁగుల మొఱలెఱుంగుచుఁ దన్ను మొఱగువాడు

తే. నఖిల రూపులుఁ దనరూపమైనవాడు నాది మధ్యాంతములు లేక యదరువాడు
భక్త జనముల దీనుల పాలివాడు వినడె చూడడె తలపడె వేగరాడె.

క. విశ్వకరు విశ్వదూరుని, విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వునవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు, నీశ్వరునిం బరమ పురుషు నే భజియింతున్.

ఉ. ఓ కమలాప్త! యో వరద! యో ప్రతిపక్ష విపక్షదూర! కు
యో్య! కవియోగి వంద్య! సుగుణోత్తమ! యో శరణాగతామరా
నోకహ! యో మునీశ్వర మనోహర! యో విపుల ప్రభావ! రా
వే, కరుణింపవే, తలపవే, శరణార్థిని నన్ను గావవే.

శా. లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యెఁ, బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁ, దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితః పరంబెరుగ, మన్నింపం దగున్ దీనునిన్,
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

మ. అల వైకుంఠ పురంబులో నగరిలో నా మూలసౌధంబు దా
పల మందార వనాంతరామృతసరః ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము 'పాహి పాహి' యనఁ గుయ్యాలించి సంరంభియై.

మ. సిరికిం జెప్పఁడు శంఖ చక్ర యుగముం జేదోయి సంధింప డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డా కర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్కనొత్తడు వివాదప్రోద్ధత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడడు గజప్రాణావనోత్సాహియై.

మ. తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతమున్, దానివె
న్నను బక్షీంద్రుడు, వానిపొంతను ధనుః కౌమోదకీ శంఖ చ
క్రనికాయంబును, నారదుండు, ధ్వజినీకాంతుండుఁ దావచ్చి రొ
య్యన వైకుంఠ పురంబునం గలుగు వాపాల గోపాలమున్.

క. అడిగెదనని కడువడిఁ జను, నడిగిన దను మగుడ నడుగఁడని నడ యుడుగున్
వెడవెడ సిడిముడి తడబడ, నడుగిడు నడుగడను జడిమ నడుగిడు నెడలన్.

మ. కరుణా సింధుడు శౌరి వారిచరమున్ ఖండింపగాఁ బంపె స్
త్వరితా కంపిత భూరి చక్రము మహోద్య ద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంతర శుక్రమున్ వహువిధ బ్రహ్మాండచ్ఛటాం
తర నిర్వక్రముఁ బాలితాఖిల సుధాంధశ్చక్రముం జక్రమున్.

శా. భీమంబై తలఁద్రుంచి ప్రాణముల్ఁ బాపెం జక్ర మాశు క్రియన్
హేమక్ష్మాధర దేహముం జకిత వన్యేభేంద్ర సందోహమున్
గామక్రోధన గేహమున్ గరటి రక్తస్రావ గాహంబు ని
స్సీమోత్సాహము చీత దాహము జయశ్రీమోహమున్ గ్రాహమున్.

మ. వమముం బాసిన రోహిణీవిభు క్రియన్ దర్పించి, సంసార దుః
ఖము వీడ్కొన్న విరక్తచిత్తుని గతిన్ గ్రహంబు పట్టూడ్చి పా
దము లల్లార్చి, కరేణుకావిభుడు సౌందర్యంబుతో నొప్పె సం
భ్రమ దాశా కరిణీ కరోజ్ఝిత సుధాంభ స్నాన విశ్రాంతుడై.

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ, గృపాంభోరాశి సౌజన్యమున్
భూరి ధ్వాన చలాచలీకృత మహాభూత ప్రచైతన్యమున్
సారోదార సితప్రభా చకిత పర్జన్యాది రాజన్యమున్
దూరీ భూత విపన్నదైన్యమును, నిర్ధూతద్విష త్సైన్యమున్.

మ. మొఱసె న్నిర్జర దుందుభుల్, జలరుహా మోదంబులై వాయువుల్
దిరిగెన్, బువ్వుల వానజల్లు గురిసెన్, దేవాంగనా లాస్యముల్
పరగన్, దిక్కులయందు జీవజయ ఖేల ధ్వానముల్ నిండె, సా
గరముప్పొంగెఁ దరంగచుంబిత నభోగంగా ముఖాంభోజమై.

క. నిడుద యగుకేల గజమును, మడువున వెడలంగఁ దిగిచి మదజల రేఖల్
దుడుచుచు మెల్లన పుణుకుచు, నుడిపెన్ విష్ణుండు దుఃఖ మూర్వీనాథా!

క. శ్రీహరి సంస్పర్శన్మున, దేహము దాహంబు మాని ధృతిఁ గరిణీ సం
దోహమును దాను గజపతి, మోహన ఘీంకార శబ్దములతో నొప్పెన్.

క. కరమున మెల్లన నివురుచుఁ, గరమనురాగమున మెఱసి కలయంబడుచున్
గరి హరికతమున బ్రతుకుచుఁ, గరపీడన మాచరించెఁ గరిణుల మరలన్.